శ్రీ

# మధ్యమవ్యాయోగము

( భాసకృతికిఁ దెలుఁగు )





ర చ యి త

' వ్యాకరణవిద్యాప్రవీణ ' ' ఉభయభాషాప్రవీణ '
' సాహిత్యాలఙ్కార ' ' సహస్రావధాని '

పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

తె నా లి
1983



పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

(కృతి సమర్పయిత)

# కృతి సమర్పణము

(పితృదేవునకు)

గీ. శమదమాదులు నీసొమ్ము శాంతమూర్తి
యీ వనుచుఁ బల్క వినుచుందు వీరు వారు
చూచుభాగ్యంబు లే దని స్రుక్కుచుందు
వేంకటప్పాఖ్య ! పితృదేవ ! వినతులయ్య !

గీ. మరణదినములు పలికెడు మంచిచెడుగు
లనుచుఁ బెద్దలు వచియింతురయ్య ! వేతె
ప్రస్తుతింపంగ ని న్నేల ? ప్రస్తుతించుఁ
బరమశివునిఁగ శివరాత్రిమరణ మదియె !

కం. 'పితృదేవో భవ'—యని తా
శ్రుతి పలుకునుగాన వేదచోదితధర్మ
వ్రత మిది దీనికి నోఁచని
కృతములు నా వయ్యెఁ దండ్రి ! యీజన్మమునన్.

కం. పితృదేవా ! యందులకయి
కృతిపుష్పార్చన మొనర్చి కృతపితృసేవా
వ్రతి నయ్యెద నని తలఁచితిఁ
గృతి యిది గొని చేయు నన్నుఁ గృతకృత్యునిఁ గా.

# పరిచయము

## భాసుఁడు

'కావ్యేషు నాటకం రమ్యమ్' 'సందర్భేషు దశరూపకం శ్రేయః' అని యభిజ్ఞులసూక్తి. కవిత్వమునకుఁ బరాకాష్ఠ యనఁ దగినది నాటకము. 'నాటకాన్తం కవిత్వ' మ్మనినారు పెద్దలు. అందులకే కావలయు: సంస్కృతమున దృశ్యకావ్యరచనకే తల యొగ్గి పెద్దల మన్ననల నందికొనినాఁడు భాసమహాకవి.

ఈ కవివర్యుఁడు వ్రాసిన రూపకములు చాలఁ గలవు. అందుఁ బదుమూఁడు రూపకము లిప్పటికి దొరకి ప్రకటితము లైనవి. ఇందు భారత రామాయణ హరివంశ మూలకములు గొన్ని, బృహత్కథా మూలకములు మఱికొన్ని.

భారతకథామూలకము లాఱు- 1. మధ్యమవ్యాయోగము, 2. దూతవాక్యము, 3. దూతఘటోత్కచము, 4. కర్ణభారము, 5. ఊరుభంగము, 6. పంచరాత్రము. రామాయణకథావలంబకములు రెండు- 1. అభిషేకము, 2. ప్రతిమ. హరివంశముపై నాధారపడినది యొకటి. 1. బాలచరితము. బృహత్కథామూలకములు నాలుగు- 1. ప్రతిజ్ఞాయౌగంధరాయణము, 2. స్వప్నవాసవదత్తము, 3. అవిమారకము, 4. చారుదత్తము. 'కిరణావళి' మున్నగునవి యింకను సరిగాఁ గానరాక యసూర్యంపశ్య లై యున్నట్లు పరిశోధకుల పరిశోధనలు తెలియఁ జెప్పుచున్నవి.

భాసుఁడు పతాకాసృష్టియం దనన్యసామాన్య ప్రతిభావిలాసము గల కవివతంసము. భట్టబాణుఁడు భాసునివైశిష్ట్యమును జాటుచు 'సూత్రధార కృతారమ్భై। ర్నాటకై ర్బహుభూమికైః। సపతాకై ర్యశో లేభే।భాసో దేవకులైరివ'అని యీతనినిఁ బ్రశంసించినాఁడు. పతాకాసృష్టి లేని రూపకము రూపకమే కా దనినా రాలంకారికులు_'ఏకమపి పతాకాస్థానకం నాట్యకావ్య స్యాలఙ్కారణమ్। కింపున ర్ద్వే త్రీణి చత్వారి వా।ఏత ద్విహీనం రూపకం న కార్యమ్' అని నాట్యదర్పణము. పతాకాస్థానకమునకు లక్షణ మి ట్లున్నది – 'ప్రస్తుతాగన్తు భావస్య। వస్తునోఽ న్యోక్తి సూచకమ్। పతాకాస్థానకమ్' (దశ. 1 పరి. 14 శ్లో.). ప్రాకరణిక మగు భవిష్యదితివృత్తమున కన్యోక్తిచే సూచన జరగిన నది పతాకాస్థానకము. ఇది సామాజికులకుఁ జమత్కారముఁ గలిగించుచు విస్మయావహ మై యానందానుభూతి నొసఁగును. భీమఘటోత్కచులసంవాద మీవ్యాయోగము నందుఁ బతాకాస్థానకము. ఘటోత్కచుఁడు భీమునిపుత్త్రుఁ డగుట యాతనిమాటలవలన భీమునకు శ్రోతలకుఁ దెలియ నై నది. ఘటోత్కచు నకుమాత్రము మధ్యముఁడు భీముఁ డగుట తెలియరాలేదు. ఘటోత్కచుని వృత్తము భీముఁడు తెలిసియుఁ దెలియనియట్లే నటించుచు ఘటోత్కచునితో సంభాషించును. విదితేతివృత్తు లగు సభాస్తారుల నిది యాశ్చర్యచకితులఁ జేయుచు నానందాబ్ధిలో నోలలాడించును .సర్వరససారభూతము లిట్టి సంనివేశము లనినారు రసజ్ఞు లగుసహృదయులు. ఇవి యీకవి కప్రయత్న లభ్యములు. ఇవిగాక, యాయాపాత్రలకు సముచితము లగు సౌశీల్యాదులు, వానివైవిధ్యము, వాని కగు మహోత్తమాదర్శములు, ప్రదర్శనయోగ్య మగురీతిని రూపకమున వాని కగు చక్కని కూర్పు, తదనుగుణ

మగుభాషాసందర్భములు, నడ్డు లేని కథాగమనము భాసునిచేతిలోనివి. అందులకే రూపకరచనలో నీతఁడు గడించినకీర్తి మఱియొకరి కెవ్వరికిని రాలేదు. ఒకమహాకవి యిందులకే యీతని నిట్లు ప్రశంసించినాఁడు – 'సువిభక్తముఖాద్యఙ్గై। ర్వ్యక్తలక్షణవృత్తిభిః। పరేతోఽపి స్థితో భాసః। శరీరే ణైవ నాటకైః' (అని).

ఇంత యేల! కాళిదాసునివంటిమహాకవి యీతని నాటకముల కైన విఖ్యాతినిఁ గాంచి నాఁటికాలమునఁ దననాటకప్రచారమును శంకించుచు 'ప్రథితయశసాం భాస సౌమిల్ల కవిపుత్త్రాదీనాం ప్రబన్ధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం బహుమానః ? 'పురాణ మిత్యేవ న సాధు సర్వం.... 'అనురీతిని వాపోయినాఁడు (చూ. మాళవికాగ్నిమిత్త్రప్రస్తావన). ఈ భాసునియనుకరణము లెన్నో కాళిదాసుని కవితయందుఁ గానవచ్చును. కవికులతిలకునకు భాసునియందుఁ గల యాదరాతిశయము నివి తెల్పి సంస్కృతవాఙ్మయమున వాల్మీకివ్యాసుల తరువాతిస్థానము భాసునిదే యని యను చున్నవి. '....నాటకేషు శకున్తలా....తత్ర శ్లోకచతుష్టయమ్' అని పేరెన్నిక గన్న నాలుగు శ్లోకములలో నొకటి యగు 'పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా। నా దత్తే ప్రియమణ్డనాఽపి భవతాం స్నేహేన యా పల్లవమ్....' అనునది చాలవఱకు భాసుని ననుకరించి సాగినదియే। 'యస్యాం న ప్రియమణ్డనాఽపి మహిషీ దేవస్య మన్దోదరీ। స్నేహా ల్లుమ్పతి పల్లవాన్....' (అభిషేకము–3. 1.) అనినాఁడు భాసుఁడు. ఇట్లే 'చక్రారపఙ్క్తిరివ గచ్ఛతి భాగ్యపఙ్క్తిః' అని (స్వప్న. 1. 4.) 'నీచై ర్గచ్ఛ త్యుపరి చ దశా చక్రనేమిక్రమేణ' అని (మేఘ. 2. 49). ఇట్లే

మఱికొన్ని యనుకరణములుగూడఁ గానవచ్చు చున్నవి. వేఱుగా నిఁక భాసకవికి మన ప్రశంసలతోఁ బని లేదు.

ఈతని కాలమును విమర్శకులు చాలమంది బహుముఖములఁ జర్చించి బహువిధములు గా నూహించిరి. మహామహోపాధ్యాయ శ్రీ తరువగణపతిశాస్త్రిగా రీతఁడు క్రీ. శ. పూర్వము 5 శతాబ్దివాఁ డని నిరూపించిరి.అదియే సముచిత మగునిర్ణయ మని తోఁచినది. ఈతని ప్రకృతగ్రంథమును గూర్చి యిఁక ముచ్చటించెదను.

## మధ్యమవ్యాయోగము

కావ్యములు – దృశ్యకావ్యములు, శ్రవ్యకావ్యములు అను రీతిని రెండువిధములు గా విభజింపఁబడినవి. దృశ్యకావ్యములకు 'రూపకము' లనునది మఱియొకపేరు. నటులయందు రామాదిరూపారోపణ మిందు జరగును గావున నివి రూపము లైనవి. రూపములే రూపకము లనఁబడినవి స్వార్థికకప్రత్యయాంతము లయి. ఈరూపకములను లాక్షణికులు పదిగాఁ బరిగణించిరి. అందు 'వ్యాయోగము' గూడ నొకటి– 'నాటక మథ ప్రకరణం, భాణ వ్యాయోగ సమవకార డిమాః। ఈహామృగాజ్క వీథ్యః। ప్రహసన మితి రూపకాణి దశ'(సాహి. 6 పరి. 3 శ్లో.). వ్యాయోగమునకు లక్షణ మి ట్లున్నది – 'ఖ్యాతేతివృత్తో వ్యాయోగ। స్స్వల్పస్త్రీజనసంయుతః। హీనో గర్భవిమర్శాభ్యాం। నరై ర్బహుభి రాశ్రితః ॥ ఏకాఙ్కశ్చ భవే దస్త్రీనిమి త్తసమరోదయః। కైశికీవృత్తి రహితః। ప్రఖ్యాత స్తత్ర నాయకః॥ రాజర్షి రథ దివ్యో వాఽభవే

ధీరోద్ధత శ్చ సః। హాస్య శృఙ్గార శాన్తేభ్య। ఇతరే ఽప్రాఙ్గినో రసాః (సాహి. 6 పరి. 231, 232. 233 శ్లో.).

ఇందు ధీరోద్ధతుఁ డగు మధ్యముఁడు (భీముఁడు) నాయకుఁడు. వీరము రసము. అతని యుత్సాహము స్థాయి. ప్రతినాయకుఁడు ఘటోత్కచుఁడు. (స్వ) ధర్మరక్షణనిమిత్తము గా వీరిరువురకు యుద్ధము జరగినది 'మాతృదేవో భవః' అనుశ్రుతి ననుసరించి మాత్రాజ్ఞా పరిపాలనము పుత్త్రధర్మ మనుచు బ్రాహ్మణహత్యకుఁ గడఁగినాఁడు ఘటోత్కచుఁడు. బ్రాహ్మణుఁడు శరణుచొరఁగా భీముఁడు క్షత్త్రధర్మము (స్వధర్మము) అగు శరణాగతరక్షణమునకుఁ బ్రయత్నపడి, మధ్యమునకు (బ్రాహ్మణకుమారునకు) మారుగా మహోత్సాహముతోఁ ద న్నర్పించి నాఁడు. స్వధర్మపరిపాలమున సఫలుఁ డైనాఁడు. ఘటోత్కచుఁడును భీమునిఁ గొనిపోవుట కాతనితో యుద్ధ మొనర్చి తన ప్రయత్నము విఫలము గాఁగా దర్పము వదలి దైన్యమును సైతము వహించి, మాత్రాజ్ఞా పరిపాలన మను స్వధర్మ (పుత్త్రధర్మ)రక్షణమున జాగరూకుఁ డైనాఁడు. కేశవదాసు, తత్పుత్త్రులు, భీమసేన ఘటోత్కచు లనువా రాఱుగురు (పురుషులు) చేరి యీకథను నిర్వహించినారు. ఇందు - హిడింబ, బ్రాహ్మణి యనువా రిద్దఱే స్త్రీ పాత్రలు. నాయకుఁడు భారతేతిహా సప్రఖ్యాతుఁ డై చంద్రవంశ్యుఁ డైన రాజు. కరుణ భయాన కాద్భుత బీభత్స రౌద్రము లిందు బ్రాహ్మణ కుటుంబమును భీమఘటోత్కచులను యుద్ధాదివర్ణనలను దమ కాశ్రయములుఁ గాఁ జేసికొని యంగరసములుగా పొసగినవి.

ఇఁక వ్యాయోగమునకు లక్షణము చెప్పినవా రందఱును 'ఖ్యాతేతివృత్తో వ్యాయోగః' అని యను చున్నారు. ఈ కథావస్తువు చాల వఱకుఁ గవికల్పితమే యగుటనుబట్టి 'ఉత్పాద్య' మనియే దీని ననవలయును. ఐనను - ధౌమ్యుఁడు పాండవ పురోహితుఁ డగుట, భీమసేనుఁడు 'మధ్యమ' పదవ్యవహార్యుఁ డగుట, హిడింబా ఘటోత్కచులు భీముని సతీకుమారు లగుట, పాండవులు ద్యూతపరాజితు లై యరణ్యవాసమున మునుల ట్లాశ్రమవాసు లగుట-ము న్నగునంశము లేతదుత్పాద్య (కథా) వస్తుసౌధమునకు మూల స్తంభము లనఁ దగినవి. ఇవి భారతేతిహాసప్రఖ్యాతము లగుట నేతదాశ్రయము గాఁ గవికల్పిత మగు బ్రాహ్మణ వృత్తాంతముగూడ నౌపచారికముగాఁ (లాక్షణికముగా) బ్రఖ్యాత మైన దనవలయును. + మధ్యమ వ్యాయోగ వ్యాఖ్యానమున-మహామహోపాధ్యాయ, శ్రీ తరువగణపతిశాస్త్రిమహోదయులు - ధనికుని వ్యాయోగలక్షణమును దీనియందు సమన్వయించుచు 'ఖ్యాతేతి వృత్తః' అనునెడఁ దూష్ణీంభావమునే వహించిరి. వీరియాశయ మేమో తెలియదు. ఒకేదినమందు నడపఁగల కథ గల యేకాంకరూపక మిది. ఇట్లు సలక్షణ మిది యై వ్యాయోగ మనిపించు కొనినది.

---

+ వ్యాఖ్యాన మి ట్లున్నది - 'అస్య రూపకస్య 'మధ్యమ' ఇతి సంజ్ఞా 'మధ్యమవ్యాయోగో వ్యవసిత ఇతి గ్రన్థాన్తే లేఖనాత్, నాయకస్య భీమస్య బహుప్రకారం మధ్యమత్వం వక్ష్యతే। తేన

'మధ్యముఁ' డనునది భీమునకు సంజ్ఞ. సంజ్ఞలు 'రూఢములు' గాను 'యోగరూఢములు' గాను నిర్దిష్టములు. భీమునకు 'మధ్యముఁ' డనునది యోగరూఢ మగు మహాసంజ్ఞ యని భాసమహాకవి. సంస్కృతభారతమున
+

తన్నామ్నా ఽస్య వ్యపదేశ్యత్వం యుజ్యతే చ। ఖ్యాతోద్ధత నాయకత్వాత్ వీరరసత్వా దస్త్రీనిమిత్తసంగ్రామత్వా దేకాఙ్కత్వా ద్బహుపురుషయుక్తత్వా చ్చ రూపక మిదం వ్యాయోగ ఇ త్యుచ్యతే। య దాహ ధనికః – ఖ్యాతేతివృత్తో వ్యాయోగః। ఖ్యాతోద్ధతనరాశ్రయః। హీనో గర్భవిమర్శాభ్యాం। దీప్తా స్స్యు ర్డిమవ ద్రసాః॥ అస్త్రీనిమిత్తసఙ్గ్రామో। జామదగ్న్యజయే యథా। ఏకాహచరితై కాఙ్కో। వ్యాయోగో బహుభి ర్నరైః' (దశరూ. 3.) (అని). 'వ్యాయోగ' శబ్దమునకు – ప్రతా. రత్నా. వ్యాఖ్య 'వ్యాయుజ్యన్తే ఽస్మిన్ బహవః పురుషాః' ఇతి 'వ్యాయోగః' అని వ్యుత్పత్తి చెప్పినది. వ్యాయోగకథకు బహుపురుషసంఘటన చాల ముఖ్య మనుట నిది తెలుపును. అందులకుఁ గొఱఁత లే దిందు.

+ "మధ్యమః పఞ్చభూతానాం। పార్థివానాంచ మధ్యమః।
భవే చ మధ్యమో లోకే। సర్వకార్యేషు మధ్యమః॥
మధ్యమోఽహ మవధ్యానా। ముత్సిక్తానాం చ మధ్యమః।
మధ్యమోఽ హం క్షితే ర్భద్ర। భ్రాతౄణా మపి మధ్యమః"
(చూ. 28, 29 శ్లో.) (చూ. నాయనువాదము 28, 29 ప.)

వ్యాస భగవానుఁడుగూడ(పాండవ)మధ్యముఁడు భీముఁ డగుటను దెలుపుచు 'పాండవమధ్యముఁ' డనినాఁడు భీముని- 'అయం బలవతాం శ్రేష్ఠః। కుంతీపుత్రో వృకోదరః। మధ్యమః పాణ్డుపుత్రాణాం। నికృత్యా స నిగృహ్యతామ్' (ఆది. 128 అ. 27 శ్లో.). ఇట్లే 'తం మ మాచక్ష్వ వార్ష్ణేయః కథ మద్య వృకోదరః। అ స్తే పరిఘబాహు స్స। మధ్యమః 'పాణ్డవో బలీ' (ఉద్యో. 90. అధ్యా. 27 శ్లో. మొ.). ఇఁక మన యాంధ్ర మహాభారత కర్త వాగనుశాసనుఁడు నన్నయ భాసుఁడట్లే నిరుపపద మగు 'మధ్యమ' శబ్దముతో భీముని వ్యవహరించి యిది యీతనియందు రూఢ మనినాఁడు- 'క్రమమునఁ బాండిత్యపరా। క్రమగర్వములందుఁ గడుఁ బ్రగల్భుండవు మా। ధ్యమ నీ చెప్పినయది కా। ర్యమ యయినను ధీరబుద్ధివై విను మనఘా ః' (ఆం. భార. అర. 1 ఆ. 267 ప.). ధర్మరాజుమాట యిది. ప్రాసస్థానమందు సంఘటిత మైన దిది. ఇట్లే యీ పర్వము నందే మఱియొకచో- '....మదగజంబువోలె మధ్యముండు....' (అర. 3 ఆ. 312 ప.) అని యున్నది. ఈ పర్వమునందే నాల్గవయాశ్వాసమున - 'ఉక్కఱి యిట్లు మధ్యము మహోగ్రశరంబులు దాఁకనోర్వ కా। రక్కసు లెల్ల....' (అర. 4 ఆ. 11 ప - మొ.). వ్యాసమహాభారతమునఁ గృతభూరిపరిశ్రము లై తమ పరిశ్రమమునకు నిదర్శనముగా భాసనన్నయలు భీముని మధ్యముఁ డనినారు. ఈ మధ్యముఁడు దీనికి నాయకుఁడుగాన నాయకునిపేరితో నిదియు 'మధ్యమ' మైనది. మధ్యమ

(నామక) మగు వ్యాయోగ మిదిగాన 'మధ్యమవ్యాయోగ' మిది. ఈ నామమందు మఱియొకచమత్కృతినిఁ గూడ కథాస్ఫోరకము గా సహృదయ హృదయావర్జక మగురీతినిఁ బొందుపఱచినాఁడు శ్లేషభంగిని భాసుఁడు ఇందు భీముఁడే కాక బ్రాహ్మణుని రెండవకుమారుఁడు గూడ మధ్యమ నాముఁడు. అందులకే యాతనిఁ బిలువ భీముఁడు వచ్చుట యాకస్మిక మగు నొకయద్భుతసంనివేశము గాఁ దటస్థించిన దిందు. ఈ మధ్యము లిద్దఱిందుఁ గూడి కథను సాగించి కథ వీరిదే యనునట్లు ప్రాధాన్యము వహించినారు. దానినే -'మధ్యమ శ్చ మధ్యమశ్చ-మధ్యమౌ. తయోః వ్యాయోగః-మధ్యమవ్యాయోగః' అనువ్యుత్పత్త్యంతరముతోఁ దెలిపినాఁడీకవి.

భీముని (పాండవ) మధ్యమత్వమునుగూర్చి శ్రీ తరువగణపతిశాస్త్రి మహోదయులు తమవ్యాఖ్యలో విశదపఱచినారు క్రిందివిధము గా-'పాణ్డవ మధ్యమస్య - పాణ్డవేషు మధ్యమస్య । యద్యపి భీమార్జుననకులా స్త్రయోఽపి మధ్యమాః । తథాఽపి తేషు ప్రాథమ్యాత్ భీమసేన ఇహ మధ్యమో గృహ్యతే' (అని). విమర్శకులు చాలమంది భీముని (పాండవ) మధ్యమత్వమును శంకించుచు, శంకాసమాధానము లేవేవో యుట్టంకించుచున్నారు. పరిశీలించిన - (పాండవ) మధ్యముఁడు భీముఁ డగుట కింతటిచర్చాసందేహము లావశ్యకములే కావు.

'పాండవ' శబ్దమునకుఁ బాండునిపుత్త్రు లర్థము. అప్పుడు పాండుపుత్త్రిత్వము (పాండుపుత్త్రు లగుట) 'పాండవ' శబ్దమునకుఁ

ప్రవృత్తి నిమిత్తము (అనఁగా) పాండునిపుత్త్రు లైనవారియం దెల్ల నిది ప్రయుక్తము గావచ్చు నన్నమాట ! అట్లే ప్రయుక్త మైన దిది భారతాదులలో. అందులకే - ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు-అనునువా రందఱును, లేక యిం దొక్కరును లేక యిద్దఱును, లేక ముగ్గురును- అనురీతిని వివక్షాధీనము గా దీనికిఁ బాండుసుతు లర్థమగుదురు. ధర్మజభీమార్జునులు పాండవశబ్దవాచ్యులు గా వివక్షించినప్పుడు, వీరిముగ్గురిలో మధ్యముఁడు (నడిమివాఁడు) భీముఁ డై (పాండవమధ్యముఁడు) మధ్యముఁడు భీముఁ డగును. ఐదుగు ర ర్థ మనిన - 'మధ్యముఁ' డర్జునుఁడు కావచ్చును. కాని చాలవఱకు భీమునినే (పాండవ) 'మధ్యముఁ' డనుట భారతాదులలోఁ గానవచ్చును ! భాసుఁ డందులకే కావలయు! 'న తావ దపరః' (నాకంటె మధ్యముఁడు నిజముగా మఱెవ్వఁడును లేఁడు) అని వచింపఁ జేసినాఁడు భీమునిచేత. ఈ 'మధ్యమవ్యాయోగ' నామకరణము భాసుని కైన యగాధభారతపరిశోధనాపారంగతత్వమును దెలియఁ జెప్పిన దనుటకు సందియము లేదు. అప్రకృత మైనను నా భారత ప్రకృతపరిశోధనమువలన నేఁడు నాకుఁ దెలియవచ్చిన యొకవిషయ మిట ముచ్చటింపక తప్పదు. ఎందఱో విమర్శకులు తిక్కనసోమయాజి 'కుంతీసుతమధ్యమునిఁ' గా నర్జునుని వచించుట ప్రమాద మని యాతని పాండిత్యమును శంకించు చున్నారు. ఇంతవఱకు దానికి సరి యగు సమాధానమే లభింప లే దనవచ్చును. ఇఁక దానికి సమాధాన మిది. పృథ - కుంతి. ఆమెపుత్త్రులు పార్థులు. వారు న్యాయ్యముగా - ధర్మజ భీ మార్జునులు. ఐనను బాండవుల నందఱను (నకుల సహదేవులతోఁ గూడఁ గలపి). పార్థులఁ గాఁ గౌంతేయులఁ గా

సంస్కృతభారతము వ్యవహరించు చున్నది చాలపట్టులందు(చూ )'తేషా మనుజసింహానాం। పఞ్చానా మమితౌజసామ్। బభూవ కృష్ణా సర్వేషాం పార్థానాం వశవర్తినీ' (ఆది. 213 అధ్యా. 2శ్లో.) – వ్యాసుఁడే యిః 'పఞ్చానామ్-పార్థానామ్'అని ('పార్థులు'ఐదుగు రగుట) విశదపఱచినాఁడ గాన – ఇఁక నా వ్యాఖ్య కిట నవకాశము శూన్యము. 'కౌన్తేయ' శబ్దమున గూడఁ బాండవు లైదుగురియం దిట్లే వ్యాసభగవానుఁ డుపయోగించుఁ గమనింపవలసి యున్నది-'తతో ఽహం ప్రేషయిష్యామి । ధృతరాష్ట్ర స శీఘ్రగాన్। ఆగమిష్యన్తి కౌన్తేయాః। కున్తీ చ సహ కృష్ణయా (ఆది. 206 అధ్యా. 26 శ్లో.) (ద్రుపదునిమాట లివి) 'కౌన్తేయ' శబ్దమ పంచపాండవులను జెప్పు చున్నదియే! ఇట్లే – (వన. 144 అధ్యా 19శ్లో. మొ.). ఐదుగురు పాండవులును గుంతీసుతు లగుదు రని – (పంః పాండవులను) 'పార్థులు' 'కౌంతేయులు' అని వ్యాసుఁడే యనుచున్నప్పుడ కవిబ్రహ్మ 'కుంతీసుతమధ్యముఁ' డని యర్జునుని ననుటలో నాతనిదోః మే మున్నది. సరిగా భారతము చదివి యాతని నర్థము చేసికొనని మనదే దోషము! ప్రకృతమునకు వత్తము. ఈ వ్యాయోగకథాకల్పనమునుగూర్చి యిఁక ముచ్చటింతును.

# కథా కల్పన

## శునశ్శేపునికథ

భాసునకు మధ్యమవ్యాయోగకథాకల్పనమునందు రామాయణము నందలి శునశ్శేపునికథ చాలవఱకుఁ దోడుపడె ననవచ్చును. రామాయణ కథ యి ట్లున్నది.

అంబరీషుఁ డయోధ్యను బాలించు చున్న యిక్ష్వాకుమహారాజు. అతఁడు యజ్ఞముచేయు చుండ నింద్రుఁ డాయజ్ఞపశువు నపహరించెను. అందుల కాపశువునుగాని లేక దానికి మారుగా నొక్కనరునిఁగాని, 'కొని ర' మ్మని రాజున కుపాధ్యాయులు చెప్పిరి. లేనిచో యజ్ఞదోషములు యజమానుని హింసించు ననిరి. యజ్ఞవిఘ్నమునకు భయపడినరాజు, పశువు నన్వేషించి కానక భృగుతుంగ మనుపర్వతమున భార్యతో ముగ్గురు పుత్త్రులతో నున్న ఋచీకునిఁ జేరెను. ఆతనిఁ దనకుఁ బశువుఁ గా నొక పుత్త్రుని విక్రయించి యజ్ఞసంపూర్త్తికి సాయపడు మని యభ్యర్థించెను.

అందుల కాతఁడు జ్యేష్ఠుఁడు నాకిష్టుఁడు, నే నాతనిని విక్రయింప ననెను. తల్లి నాకుఁ గనిష్ఠుఁడు ప్రీతిపాత్రుఁడు, నే నాతని నీయ ననెను. ఇఁక మధ్యముఁ డగు శునశ్శేపుఁడు, తల్లిదండ్రులమాటలవలన మహారాజునకుఁ దాను విక్రయింపఁబడితి నని తెలిసి 'తన్నుఁ గొని పొమ్మని

యంబరీషునితో బయలుదేఱెను. అంబరీషుఁడు నూఱువేలగోవుల నిచ్చి శునశ్శేపునిఁ గొని రథ మెక్కించి తీసికొనిపోవుచు, మార్గమధ్యమున దున్న పుష్కరతీర్థమునందు మధ్యాహ్నసమయ మగుటను విశ్రమించెను. అచ్చటఁ దన మేనమామ యగు విశ్వామిత్రుఁ డుండుట శునశ్శేపుఁడు తెలిసి, యాతనినిఁ 'దన్ను రక్షింపు'మని శరణు చొచ్చెను. దయతో విశ్వామిత్రుఁ డాతని కభయ మిచ్చి, తనపుత్రులను యజ్ఞపశువులఁగా నాతనికి బదు లేఁగు మనెను. పుత్రు లాతనియాజ్ఞ ధిక్కరింపఁగా వారి శాప మిచ్చి, మేనల్లునకు వేదమునందలి గాథలు రెం డుపదేశించి, వానితో దేవతల స్తుతించినఁ గార్యసిద్ధి వడసెద వనెను. అది విని యాతఁడు సంతసించి యంబరీషునితో యజ్ఞదేశము చేరి, మహర్షి చెప్పినట్లే నొనర్చి యింద్రప్రసాదమున బంధవిముక్తుఁ డాయెను. ఇంద్రోపేంద్ర ప్రసాదమున యజ్ఞము గూడ సఫల మాయెను. (ఇది రామాయణగాథ)

## సామ్యము

ఋచీకునకు మారుగాఁ గేశవదా సనుపేరితో నొక వృద్ధ బ్రాహ్మణుఁ డిందుఁ గల్పితుఁ డైనాఁడు. ఋచీకుని పుత్రులే యిచ్చట బ్రాహ్మణుని ముగ్గురు సుతులు. అంబరీషునకు మారుగా ఘటోత్కచుఁ డిటఁ గల్పింపఁబడినాఁడు బ్రాహ్మణపుత్త్రహరణమునకు. తల్లి పారణమునకై పుత్త్రవరణ మిచ్చట జరగినది. యజ్ఞపరిపూర్తికై బ్రాహ్మణసుతవరణ

మచ్చట జరగినది. ఋచీకునిభార్యయే కేశవదాసుభార్య యగు బ్రాహ్మణి. జ్యేష్ఠునిఁ దా నీయ ననినాఁడు ఋచీకుఁ డచ్చట. కేశవదాసు గూడ నిచ్చట నట్లే ! అచ్చట ఋచీకునిభార్య గనిష్ఠునిఁ దా నీయ ననినది. బ్రాహ్మణియు నట్లే యనిన దిచ్చట. ఇఁక నచ్చట మధ్యముఁడు (శునశ్శేపుఁడు) తల్లిదండ్రులచే విడువఁబడి కొనిపోఁబడినాఁ డంబరీషునిచేత. ఇచ్చటి మధ్యముఁడును (బ్రాహ్మణుని రెండవకుమారుఁడును) ఘటోత్కచుని వెంబడింపవలసినవాఁ డైనాఁడు పితరులచేఁ బరిత్యక్తుఁ డై. విశ్వామిత్రుఁ డచ్చట గాధోపదేశమున రక్షించి బంధవిముక్తునిఁ జేసినాఁడు మధ్యముని. ఇచ్చట నాయకుఁ డగు మధ్యముఁడు (భీముఁడు) తనక్షాత్త్రమున కనుగుణము గాఁ బ్రవర్తించి బంధవిముక్తి గలిగించినాఁడు మధ్యమునకు (బ్రాహ్మణుని రెండవకుమారునికి). తరువాత నిచ్చట నాయకుఁడు (భీముఁడు) తా నన్నమాటకై ఘటోత్కచునివెంట నేఁగి, హిడింబను జూచి, యామె భక్తితో నాదరింపఁ దానును బంధవిముక్తి నందె బ్రాహ్మణుని నాతనికుటుంబమును దానును దనకుటుంబమును సగౌరవముగా సాగనంపినాఁడు వినయవిధేయతలతో. ఇట్లిది తుదకు శుభపర్యవసాయి గా ముగిసిన దిచట. అచ్చటఁ గూడ యజ్ఞ మింద్రోపేంద్రప్రసాదమున ఫలవంతమై శుభపరిణామము గల దైనది. ఇట్లీగాధతో రామాయణగాథ (శునశ్శేపోపాఖ్యానము) చాలసామ్యము వహించియున్నది. రామాయణము

నం దీపట్టున శునశ్శేపుని 'మధ్యమః' అనుటగూడ గమనింపవలసి యున్నది.+

## కథ_శంకాసమాధానములు

ఈవ్యాయోగకథయందుఁ గొన్ని సందేహము లున్నవని కొందఱుదాహరించినారు. వారు వాని కేవో సమాధానములు వచింపఁజూచినారు గూడ అందు ఘటోత్కచుని భీముఁడు, భీముని ఘటోత్కచుఁడును నెఱుఁగరా? ఎఱుగనట్లు వర్ణించుచున్నభాసునివర్ణన యెంతవఱకు యుక్తమనునది యొకటి; ఎఱుఁగుట కవకాశము లేదని భారతమునుబట్టియే కొందఱు సమాధానము చెప్పఁ జూచిరి. అది యసంగతము. ఘటోత్కచుఁడు సహదేవునకు దూతయై లంక కేఁగి యాతనివలన రత్నరాసులు మున్నగునవి కొని వచ్చినట్లు సం. భారతము వచించుచున్నది. ఈ విషయము గొన్ని సం. భార. ప్రతులలో లేనందునఁ బ్రాశ్నికులవాద ముచిత మనఁ

---

+ '.... .... మధ్యమో వాక్య మబ్రవీత్। .... .... పితా జ్యేష్ఠమవిక్రేయం। మాతా చాఽహ కనీయసమ్। విక్రీతం మధ్యమం మన్యే। రాజన్ పుత్రం నయస్వ మామ్' (రామా. బాల. 61 స. 20, 21 శ్లో.).

గాదు. గంధమాదనమున ఘటోత్కచుఁడు ధర్మజుని సంమతితో భీమునిచే స్మరింపఁబడి ద్రౌపది మున్నగువారిని వహించి కొనిపోయినట్లు(సం.భార.) వచించుచున్నది. కావునఁ బాండవుల కాతఁడు తెలియరాఁ డనుట సముచిత మనిపింపదు ఇచట నిదియు భాసునికల్పనకుఁ జెందినదిగానే యెంచుకొనుట సముచిత మగుసమాధానము.

రెండవది—ఘటోత్కచునివర్ణనయందు భాసుఁడు 'కనకకపిలకేశః' అని వర్ణించి కేశవంతుఁ డీతఁ డనినాఁడు. భారతము 'ఘటోత్కచ' శబ్దమునకు ఘటో హాస్యోత్కచ ఇతి మాతా తం ప్రత్యభాషత । అభవత్తేన నామాఽస్య ఘటోత్కచ ఇతి స్మ హ'(ఆది.155 అధ్యా.38 శ్లో.) అని వ్యుత్పత్తి ప్రదర్శించినది. 'ప్రణమ్య వికచః పాదౌ' అనికూడ ననినది. పై (౩౮) మూలశ్లోకమును నీలకంఠీయ మిట్లు వివరించినది

(ఘట ఇతి) ఘటసాదృశ్యా ద్ఘటః శిరః । ఘట స్సమాధిభేదే+ నా శిరః' కూటకటేషు చ' ఇతి మేదినీ । హ-స్పష్టమ్ । అస్య పుత్రస్య ఉత్కచః వికేశః యత స్తతో - ఘటః ఉత్కచో య స్యేతి యోగా ద్ఘటోత్కచ ఇతి నామాఽబ్రవీత్' — (అని). దీనిఁబట్టి— 'కేశవిహీనుఁడు' హైడింబుఁ డనిపించునుగాన, ఇది భారతవిరుద్ధ మని కొంద ఱందురు;

---

+ 'ఘట స్సమాధిభేదేభశిరఃకూటకటేషు చ' —అని మేదిని యిప్పటి పాఠము (చూ.) 1969 సం. ప్రతి.

కాని భారతమందే యీతఁడు కేశయుతుఁ డైన ట్లున్నది — (చూ.) ఘటోత్కచాలాయుధయుద్ధవర్ణనాసందర్భము — 'తా వన్యోన్య మభి ద్రుత్య । కేశేషు సుమహాబలౌ । భుజాభ్యాం పర్యగృహ్ణీతాం మహా కాయౌ మహాబలౌ' (ద్రోణ. 178 అధ్యా. 29 శ్లో.). కొన్ని ప్రతులలో— 'తామ్రకేశో హరిశ్మశ్రుః' (సభా.) అని ఘటోత్కచవర్ణన గానవచ్చు చున్నది. భాసుఁడీసభాపర్వవర్ణన నాధారము గాఁ గొనియే 'కనకకపిల కేశః' అనినాఁ డనిపించును. మహాభారతము 'ఘటోత్కచ' శబ్దమునకుఁ జెప్పిన వ్యుత్పత్తి జననసమయస్థితిని (బోడితలతోఁ బుట్టుటను) దెలియఁ జెప్పునదియే కాని సర్వథా కేశవిహీనుఁ డాతఁ డగుటను వచించునది కాదు. కావున—ఒకటికి రెండు మూఁడు తడవులు కేశవంతునిఁ గా భాసుఁ డీతనిని వర్ణించుట యసంగతము గాని భారతవిరుద్ధము గాని కాదు. భారతమర్మజ్ఞ శిరోమణి భాసమహాకవి. అందులకు మధ్యమ (వ్యాయోగ) నామకరణ ముతోపా టిదియు నొక నిదర్శన మనఁ దగినది.

# ఆంధ్రీకరణము

ఈ మధ్యమవ్యాయోగమును జాలమంది యాంధ్రీకరించిరి. ఐనను నే నిందులకుఁ గడఁగుట చాలపట్టుల నిందు భాసవాణి చాలగంభీరముగా సాగిన దని నా కనిపించుటయే: మఱియొకమాట: మూల మనువదించు పట్టుల భావస్వాతంత్ర్య మనుపేర నుచ్ఛృంఖలప్రవృత్తి నాయనువాదమున కంటరానిది. భాషాసంప్రదాయముల కనుగుణము గా జాతీయ రచన జరపుచు మూలకర్తయాశయములకు భంగము కలుగకుండ వారి యడుగు జాడలలో సాగి వారికృతులను దెలుఁగువారి కందించుటయే యిందు నా యాశయము. అది యెంతవఱకు నెఱవేఱినదో నిర్ణయింపవలసినవారు సహృదయు లగు విద్వాంసులు. 'ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్' అనికదా కాళిదాసు. నేనును ననునది యదియే:

ఇఁక నాసాహితీప్రస్థానము నంతను నపారకరుణాకటాక్షము తో నిట్లు ఫలవంతముఁ గా సాగించు చున్న మా పరాదేవిని మఱవను. ఆమెకు భక్తిపూర్వకనానమోవాకము లివిగో:

---

# కథాసంగ్రహము

కురుజాంగల దేశమునందు యూపగ్రామము గలదు. అందు కేశవదా సను బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు మాఠరసగోత్రుఁడు. కల్పశాఖాధ్వర్యుఁడు. (ఆ కురుజాంగలములకు) ఉత్తరదిశయందు 'ఉద్యామక'మను గ్రామములోఁ గేశవదాసుమేనమామ నివసించుచుండెను. అతఁడు కౌశికసగోత్రుఁడు. యజ్ఞబంధు వని యాతని పేరు. ఈతని పుత్రున కుపనయనము జరగ నున్నది. అందులకై సకలత్రపుత్రము గా నడవిమార్గమున నేఁగు చున్నాఁడు కేశవదాసు.

ద్యూతపరాజితు లైన పాండవు లరణ్యవాసము సలుపుచు ధౌమ్యాదులతో నాశ్రమమందు వసించు చున్నారు. తమపురోహితుఁ డగు ధౌమ్యుఁ డొకచో యజ్ఞము సలుపుచుండ, నాశ్రమ (ధర్మ) రక్షణమునకు మధ్యముని (భీముని) నియమించి పాండవులు (తక్కినవారు) యజ్ఞమునకు వెళ్లిరి. భీమసేనుఁ డాశ్రమబహిఃప్రదేశమునందు దూరముగా నొకచో వ్యాయామము సలుపు చుండెను. ఈ వ్యాయామప్రదేశమునకు దగ్గఱగానే కేశవదా సుపనయనమునకై పయనించు చుండెను.

ఈ వనమందే హిడింబ పుత్రునితో నివాస మున్నది. పాండవులు ఋషులతో నాశ్రమమునం దుండుట యామె యెఱిఁగియు రాక్షసి యగుటను

తా నచ్చటికిఁ బో నవకాశము గానరాక, తన కభిలషిత మగు పతి దేవుని దర్శనమునకై యాతఁడు తన కడకు వచ్చున ట్లొకయుపాయము పన్నినది.

ఆ యడవిలోఁ బాండవనివాసమునకు సమీపమున బ్రాహ్మణ కుటుంబము ప్రయాణించుట యామె తెలిసికొనినది. ఆమె 'ఉపవాస ముంటిని. పారణమునకు నరుఁ డొక్కఁడు కావలయును. త్వరగాఁ గొని ర'మ్మని తనపుత్రుని ఘటోత్కచునిఁ గేశవదాసు పయనించు చున్న సమయమునకు సరిగా నా యడవికిఁ బంపినది. ఆ సమయము సరిగా భీముఁడు వ్యాయామము సలుపు చున్నసమయము. అది యామెకుఁ దెలిసినదే! బ్రాహ్మణరక్షణమునకై భీమసేనుఁ డవశ్యము ప్రయత్నించి తనకడకుఁ దన కుమారునితో రాఁగలఁ డని యామె యూహ. అందులకే ఘటోత్కచునిఁ బ్రాహ్మణానయనమునకుఁ బంపినది హిడింబి. ఘటోత్కచుఁడు మాతృదేవుఁడు. తల్లియాజ్ఞ చొప్పునఁ బారణమునకై బ్రాహ్మణ కుమారులలో నొకని నీయఁ గోరినాఁడు. తండ్రి జేష్ఠునిఁ, దల్లి కనిష్ఠునిఁ దా మీయ మనఁగాఁ బరిశేషన్యాయమున మధ్యముఁడే (బ్రాహ్మణుని రెండవ కుమారుఁడే) పారణార్థము దత్తప్రాయుఁ డై నాఁడు ఘటోత్కచునకు. ఇట్లు తల్లిదండ్రులచే నొసఁగఁబడిన మధ్యముఁడు, పిపాసాశాంత్యర్థము ఘటోత్కచుని యనుమతితో నచ్చటి కనతిదూరమున నున్న యొకకొలని కేఁగి, యచ్చటఁ దనకుఁ దానే పరలోకమున కగు జలదానాదు లొనర్చు కొనుచుఁ గొంత తడసెను.

తల్లి యాహారసమయ మతిక్రమించు చున్న దను తహతహతో 'మధ్యమ! మధ్యమ!' యని బ్రాహ్మణకుమారుని ఘటోత్కచుఁడు పేరెత్తి యొకటికి రెండు మూఁడు తడవులు పిలిచెను. అది భీముఁడు విని తానును మధ్యముఁ డగుటను దన్నే పిలుచు చున్నాఁ డెవఁడో! యని తాను హిడింబాపుత్రుఁ డున్న కడకు వచ్చెను. కేశవదాసు భీమునకు వృత్తాంత మంతయుఁ దెలిపి కుమార రక్షణమునకుఁ గా నాతఁ శరణుచొచ్చెను. భీమసేనుఁడు మధ్యమునకు (బ్రాహ్మణుని రెండవ కుమారునకు)బదులు తాను వచ్చెద నని ఘటోత్కచు నొప్పించి,బ్రాహ్మణ కుమారుని(మధ్యముని) విడిపించెను.

ఘటోత్కచుఁడు తనకుమారుఁ డగుట భీమసేనుఁ డాతనిమాటల వలనఁ దెలిసి, యాతని బలపరీక్షకై తన్ను బలాత్కరించి కొని పొమ్మనెను. అందులకు హిడింబాసుతుఁడు ప్రయత్నపడి భీమునితో యుద్ధ మొనర్చియుఁ గొనిపోఁ జాలక 'చేసినసమయము స్మరించి మాట దప్పక తనవెంట ర' మ్మనెను. అందులకు భీముఁ డంగీకరించి హిడింబాఘౌర్త్యము నకు రోయుచు నది యెట్టిదో కనుఁగొనుటకో! యనున ట్లాతనివెంట వచ్చి హిడింబకు దర్శన మిచ్చెను. బ్రాహ్మణకుటుంబము గూడ భీముని వెంబడించి యచ్చటికి వచ్చెను. హిడింబ భీమునినిఁ దండ్రిగా ఘటోత్కచున కెఱిఁగించి యాతనిని సవినయము గా భీమునికి నమస్కరింపఁ జెప్పెను. ఘటోత్కచుఁడును దాను జూపిన ధార్ష్ట్యమును క్షమింప భీముని వేఁడ

కొనెను. భీముడును మా కపేక్షితమే యది యనుచు 'ధార్తరాష్ట్రకుల దవాగ్ని'వని యాతని నభినందించెను.

హిడింబయుఁ దాను సలిపిన యీ దౌష్ట్యమున కార్యపుత్ర దర్శనాభిలాషమే కారణ మని భీమసేనునకు నచ్చఁజెప్పెను. అతఁడును 'జాత్యా రాక్షసీ నతు వృత్తేన' అని యామె నభినందించెను.

తరువాత వా రందఱు పునరాగమనము గోరుచు సగౌరవము గా సతీపుత్రులతో బ్రాహ్మణుని సాగ నంపి యీ వ్యాయోగమునకు భరత వాక్యము పలికిరి.

---

# పాత్రలు

[పురుషులు]

| | | |
|---|---|---|
| సూత్రధారుఁడు | – | నాటకము నడుపు నాట్యాచార్యుఁడు. |
| వృద్ధుఁడు | – | ముసలిబ్రాహ్మణుఁడు. కేశవదాసు – అని యితనిపేరు. |
| ప్రథముఁడు | – | బ్రాహ్మణుని పెద్దకొడుకు. |
| ద్వితీయుఁడు | – | బ్రాహ్మణుని రెండవకొడుకు, 'మధ్యముఁడు' అని యితని పేరు. |
| తృతీయుఁడు | – | బ్రాహ్మణుని మూఁడవకొడుకు. |
| ఘటోత్కచుఁడు | – | హిడింబాభీమసేనుల కుమారుఁడు. |
| భీమసేనుఁడు | – | నాయకుఁడు. కుంతీపుత్త్రులలోరెండవవాఁడు, మధ్యముఁడు – అని యీతని కిందలిపేరు. |

[స్త్రీలు]

| | | |
|---|---|---|
| బ్రాహ్మణి | – | కేశవదాసుభార్య. |
| హిడింబ | – | రాక్షసి, భీముని భార్య. |

శ్రీ

# మధ్యమవ్యాయోగము



[నాంది ముగియఁగానే సూత్రధారుఁడు ప్రవేశించును.]

సూత్రధారుఁడు :-

మ. హరిపాదం బసితోత్పలాసివిశదశ్యామావదాతంబు నా
సురనారీహృదయాంబుజాతహిమసంస్తోకంబుఁ దైత్రిలోక్యభూ
పరిమాణం బొనరింపఁ జాఁగి క్రమియింపన్ సాగుచో వ్యోమసా
గరవైదూర్యకదుర్గసంచరసమాకారంబు మి మ్మోముతన్.

—ఆర్యమిశ్రు లగు సామాజికుల కిట్లు విన్నవించుకొనుచున్నాను.

అన్నా ! యే మిది ! విన్నవింప నే నవహితుఁడ నగు చుండ, ధ్వని యేదో వినవచ్చు చున్నది ! కానీ ! తెలిసెదను.

[నేపథ్యమున]

అయ్యో ! తండ్రీ ! వీఁ డెవ్వఁడో !

సూత్ర :- సరే ! తెలిసినది.

గీ. అఱచు నయ్యో ! యటంచు దైన్యంబుతోడఁ
బ్రాహ్మణుఁడె వీఁడు సంశయింపంగఁ గాదు
భయపఱచు నింపుకేనియుఁ బాపభీతి
లేని దుష్టాత్ముఁ డెవ్వఁడో! వీని నిపుడు.

[నేపథ్యమున-మరల]

అయ్యో ! తండ్రీ ! వీఁ డెవ్వఁడో !

సూత్ర :- అన్నా ! ఇప్పుడు బాగుగాఁ దెలిసినది. వీఁడుగో ! పాండవమధ్యముని యపత్యము హిడింబారణిసంజాత మగు రాక్షసాగ్ని నిరపరాధి యగు బ్రాహ్మణజనమును జాల భయపఱచు చున్నది. దుర్భరము దుర్భరము సతితో సుతులతోఁ బరివేష్టితుఁ డగు బ్రాహ్మణునకు దాపరించిన యీ దుర్దశ, ఇదిగో !

చం. విడువక రాక్షసుం డొకఁడు వెంటఁబడన్ భయవిహ్వలాత్ముఁడై
కడుశ్రమ మందుపుత్త్రికులు గొంతయుఁ జుట్టుకొనంగ వ్యాకులం
పడియెడు వృద్ధుఁ డీద్విజుఁడు వ్యాఘ్రము వెందవులన్ భయంబునన్
వడఁకెడు వత్సలన్ మొదవుఁ బాయఁగ లేని వృషంబుపోలికన్.

[నిష్క్రమించును]

ఇది స్థాపన

---

[ముగ్గురు పుత్త్రులు — భార్య — తన్నుఁ జుట్టియుండఁగా — కేశవదాసు, అతని వెనుక-ఘటోత్కచుఁడు ప్రవేశింతురు]

వృద్ధుఁడు :— అయ్యో ! ఎవఁడురా : వీఁడు !

శా. బాలాదిత్యమయూఖపుంజములలెన్ వ్యాకీర్ణముల్ కేశముల్
గాలభ్రూకుటి సంపుటోజ్జ్వల పిశంగవ్యాయతంబుల్ గనుల్
గ్రాలున్ దేహము విద్యుదంబుధర మై గ్రైవేయహారంబుతో
నాలోకింప యుగాంత భైరవ సదృక్షాకారుఁ డై వర్తిలున్.

ప్రథముఁడు :— అయ్యో ! తండ్రీ ! యెవ్వఁడు వీఁడు !

సీ. కనుదోయి గాంతితో గ్రహయుగంబును బోలఁ
బీన మై వెడఁద యై వెలయ నురము
బంగారమును బోలి పరఁగ శిరోజముల్
గనకాంబర మధోంశుకంబు గాఁగ
నిరులట్లు నల్లనై యెసఁగి దేహచ్ఛాయ
ధవళితోద్వృత్త మై దంష్ట్ర లలరి
కమనీయ చంద్రలేఖను గాఢ సంశ్లేష
మును బొందు నూతనాంబుద మనంగ

గీ. నలరి యున్నాఁడు వనమునం దరుగునెడల
వెంబడించెడు మనలను విడువ కిపుడు
కలఁతవడియెడుఁ జిత్తంబు, గాళ్లు వడఁకుఁ
జేయునది యేమి చెప్పుమా ! యోయి తండ్రి !

ద్వితీయుఁడు :- అయ్యో ! ఎవఁడు వీఁడు ?

మ. హాలముం బోలును నాస, నీలఘనతుల్యం బౌను వర్ణంబు, బా
హులు దంతావలహస్తముల్, కలభదంతోద్దీప్రముల్ దంష్ట్రి లు
జ్జ్వల మై పేర్చినహవ్యవాహుకరణిన్ భాసిల్లుఁ దేజంబు, ధీ
తిలఁ జేయుం ద్రిపురంబు లేర్చుహరునుద్దీప్తప్రకోపం బనన్.

తృతీయుఁడు :- ఓతండ్రీ ! ఎవఁడు వీఁడు ! మనల నిట్లు వేధింపు
చున్నాఁడు.

గీ. వజ్రపాతంబు గిరిరాజవర్గములకు
సాళువంబు విహంగమసంఘములకు
సింహరాజంబు మృగముల సంహతులకుఁ
బురుషవేషంపుమృత్యువపో ! యితండు.

బ్రాహ్మణి :- ఆర్యా ! యితఁ డెవఁడు ? మనల వేఁచు చున్నాఁడు !

ఘటోత్కచుఁడు :- ఓబ్రాహ్మణుఁడా ! నిలు ! నిలు !

ఉ. నావలనన్ భయంపడి వినాశ మొనర్చుచు ధైర్యసారమున్
గావఁగ లేక భీతిలెడి కాంతను బుత్త్రుల నేఁగె దేమి! వి
ప్రా! విహగేంద్రపక్షజనితానిలచోదితతీవ్రరుణ్మహా
పావక మౌచు నార్తి మెయి భామినితోఁ జను పన్నగంబటుల్.

ఓ బ్రాహ్మణుఁడా! వెళ్లకు! వెళ్లకు!

వృద్ధుఁడు :- బ్రాహ్మణీ! భయపడకు! భయపడకు! పుత్త్రులారా! భయ పడకుఁడు! భయపడకుఁడు! ఈతనిమాట యుక్తాయుక్త పరిజ్ఞానముతోఁ గూడి యున్నది.

ఘటో :- (తనలో) అబ్బా! కష్టము.

గీ. ఎఱుఁగుదును బ్రాహ్మణోత్తము లెందు నెపుడు
పూజ్యతము లంచుఁ బృథివిలో భూరిమహిమ
నిది యకార్యమ యైన నా కిదియ కార్య
మయ్యె నిశ్శంకము గ నంబయాజ్ఞ నిపుడు.

వృద్ధుఁడు :- మఱచితివా! పూజ్యుఁ డగు జలక్లిన్నమహర్షి యీవనమున రాక్షసు లున్నారు. జాగరూకతతో నరుగుఁ డని మనకుఁ జెప్పినమాట. ఆ భయమే యిప్పుడు దాపరించినది.

బ్రాహ్మణి:- ఆర్య యీ సమయమున నిర్వికారుల ట్లగపడెద రేమి!

వృద్ధుఁడు :- దైవోపహతుఁడను ! నే నేమి చేయఁగలను ?

బ్రాహ్మణి.- మొర యిడుదము.

ప్రథముఁడు:- అమ్మా ! ఇట మనమొర యాలకించువా రెవరు ?

గీ. తిమిరపుంజంపుఁగాంతులఁ దేజరిల్లి
శూన్య మీవని, ఖగ మృగ స్తోమములను
వ్యాకులాంతర మిది, యగమావరుద్ధ
దిక్పథం బిది నివసింత్రు ధీరు లిచట.

వృద్ధుఁడు :- బ్రాహ్మణీ ! భయపడకు ! భయపడకు ! ధీరచిత్తులకు నివాస మీవన మని వినినంతనే నాభయము మటుమాయ మైనది. పాండవుల యాశ్రమ మిచటికి దగ్గఱనే యున్న దనుకొందును!

ఉ. అండను జేరువారి కభయం బిడువారలు భూరి సాహసో
ద్దండులు యుద్ధదుర్మదులు తాము వహింతురు దీనపక్ష మా
పాండవు, లుగ్రకర్మముల బాధిలఁజేసెడు నిట్టివారికిన్
దండనమున్ విధింతురు యథావిధి, దక్షులు వార లన్నిటన్.

ప్రథ :- నాయనా ! పాండవు లిపు డచట లే రనుకొందును !

వృద్ధుఁడు :- కుమారా ! నీ కెట్లు తెలియును?

ప్రథ :- వారు శతకుంభ మను యజ్ఞమునకై మహర్షి ధౌమ్యుని యాశ్రమమునకు వెళ్ళి రని, ఆయాశ్రమమునుండి వచ్చిన బ్రాహ్మణుఁ డొకఁడు చెప్పఁగా వింటిని.

వృద్ధుఁడు :- అయ్యో ! చచ్చితిమి !

ప్రథ :- తండ్రీ ! వా రందఱును నచ్చటికి వెళ్ళలేదు. ఆశ్రమరక్షణమునకై మధ్యముని నిచటనే యుంచినా రఁట.

వృద్ధుఁడు :- అట్లేని వా రందఱు నిచ్చట నున్నట్లే !

ప్రథ :- ఈసమయమున నతఁడును వ్యాయామ మొనర్చుటకు దూర మేఁగె నని వింటిని.

వృద్ధుఁడు:- అన్నా ! నాయాశ ముడుగంటినది. పోనీ ! కుమారా ! యీతనినే ప్రార్థించి చూచెదను.

ప్రథ :- వలదు. వలదు. ఊరక యేల యీయాయాసము !

వృద్ధుఁడు :- వత్సా ! ప్రార్థన యనునది పురుషునకు ఫలనైరాశ్యమున నేర్పడు నిర్వేదమును బాఱఁద్రోలునదిగదా !

ప్రథ :- కానిండు ! అదియును జూతము ! ఓయీ పురుషుఁడా ! మాకు మోక్ష ముండునా ?

ఘటో :- ఉండ కేమి ? ఉండును ! మీరు నే నొనర్చునొడంబడిక కంగీకరింతురేని.

వృద్ధుఁడు :— ఏ దాయెడంబడిక ?

ఘటో :— మాయమ్మ చాలఁ బూజ్యురాలు. ఆమె - నే నుపవాసవ్రత పరిసమాప్తి యొనర్పవలయును. ఈవనప్రదేశమున వెదకి మనుష్యు నొకనిఁ గొని రమ్మని నా కాజ్ఞ యొసఁగినది. అందులకే నిన్ను నేను బరిగ్రహించితిని.

గీ. నావలన మోక్ష మందఁగా నీవు గోరు
దేని పుత్త్రద్వయంబుతో మాసనీయ
పత్నితోడను గని బలాబలము లెంచు
నొక్కపుత్త్రుని విడువుమీ ! యోద్విజాతి !

వృద్ధుఁడు :— ఎట్లూ ! అయ్యో ! నే నిట్లొనర్తునా ? ఓరీ ! రాక్ష సాపశదా ! నేను బ్రాహ్మణుఁడను గాక, కటికివాఁడ నగుదు ననుకొంటివా !

కం. శ్రుత సంపన్నుఁడ వృద్ధుఁడ
క్షితిదేవుఁడ శీలగుణ విశిష్టుని సుతు స
మ్మతిఁ బురుషాదున కిడి యే
గతితో సుఖ మేను బొందఁగాఁ గలవాఁడన్.

ఘటో :-

గీ. కోరఁగా నిన్ను నేనయి కొడుకు నొకని
బ్రాహ్మణశ్రేష్ఠ ! యీ నొడంబడవయేని
నీ కుటుంబంబు నీవును నేఁడె యిదిగొ !
యొక్క త్రుటిలో వినాశంబు నొందఁ గలరు.

వృద్ధుఁడు :- బ్రాహ్మణీ ! ఇదియే నా నిర్ణయము.

గీ. చేయ వలసిన కార్యముల్ చేసె, వయసు
పరిణతం బైన శిథిల మై వ్రాల నుండెఁ
దనువు నాయది, విధిసంస్కృతంబు, దీని
రాక్షసాగ్ని వేల్చెద సుతాపేక్షతోడ.

బ్రాహ్మణి:- ఆర్యా ! ఇట్లు కా దిట్లు కాదు. పతివ్రత యనఁగాఁ-బతియే ధర్మాచరణమున కాధారము గాఁ గలదికదా! అపేక్షిత మగు ఫలము సంపాదించి కృతకృత్య మైన యీశరీరముతోఁ బతిదేవులను - ఈ కుటుంబమును గాపాడఁ గోరెద.

ఘటో :- మాననీయు రా లగు మాయమ్మ స్త్రీజనమును గోరుట లేదు. తల్లీ ! మీ రాఁగుఁడు !

వృద్ధుఁడు :- పద ! నేను నీవెంట వచ్చెదను.

ఘటో :- ఎట్లూ ! నీవా వచ్చెదవు ! మూఁడుకాళ్లముసలివి, తొల

ప్రథ :- తండ్రీ ! నేను గొంచెము మాట లాడెదను.

వృద్ధుఁడు :- కుమారా ! యే మందువు ?

ప్రథ :-

గీ. ప్రాణముల నిచ్చి గురుదేవ ప్రాణములను
గాంక్ష చేసెద రక్షింపఁగాను, నన్ను
విడువఁ దగునయ్య యోయయ్య ! వినఁగదయ్య!
యీ కులంబును రక్షింప నెంచి నీవు.

ద్వితీ :- ఆర్యా ! ఇట్లు కా దిట్లు కాదు !

కం జ్యేష్ఠుఁడు కులమున జగతిని
శ్రేష్ఠుఁడు పితరులకుఁ జాలఁ బ్రియతముఁ దగుటన్
శ్రేష్ఠాచారము స్మృతి నిడి
జ్యేష్ఠుని రక్షింప నేనె యేఁగెద నార్యా !

తృతీ :- అన్నలారా ! ఇట్లు కా దిట్లు కాదు!

గీ. పితృసముఁడు భ్రాత జ్యేష్ఠుండు పిన్న కనిరి
బ్రహ్మవాదులు కావునఁ బ్రాణరక్ష
గురుల కొనరించుసర్హత యరయ నాకె
కలదు మీ రేరు నర్హులు గారు కారు!

ప్రథ :- వత్సా ! ఇట్లు కా దిట్లు కాదు!

కం. ఆపద యౌనెడ జనకున
కాపద తొలఁగించు జ్యేష్ఠుఁ డాత్మజుఁడేకా !
ప్రాపయి, కావున గురువులఁ
గాపాడెదఁ బ్రాణరక్ష గలుగఁగ నేనే !

వృద్ధుఁడు :- జ్యేష్ఠుఁడు నా కత్యంత మిష్టుఁడు. నే నాతని విడువఁజాలను!

బ్రాహ్మణి :- పెద్దవాని నార్యులు గోరినట్లే కనిష్ఠుని నేనును గోరుచున్నాను.

ద్వితీ :- తల్లిదండ్రులు గోరని నన్ను మఱెవ్వరు కోరుదురు ?

ఘటో :- నేను గోరుచున్నాను. రా ! త్వరగా.

ద్వితీ :-

మామకప్రాణములచేత నోమఁ గలిగి
నాఁడ గురుప్రాణముల నయినాఁడ సుకృతి
నధికబాంధవమై త్రిచే నందఁ గలుగు
నంతకస్నేహ మది పొంద నల్పి గాదు.

ఘటో :- ఆహా ! ఈ బ్రాహ్మణబ్రహ్మచారికి బంధుప్రేమ యెంతటిది?

ద్వితీ :- తండ్రీ ! నమస్కారము.

వృద్ధుఁడు:- రారా ! నాయనా !

గీ. వత్స ! గురువత్సలా ! భవత్ప్రాణములను
నొసఁగి కొనినావు గురువులయసువు లింక
నవిజితాత్ముల కందఁగా సలవి గాని
బ్రహ్మలోకంబు పడయు శాశ్వతము గాఁగ

ద్వితీ :- అనుగ్రహింపఁబడితిని. తల్లీ ! నమస్కరించు చున్నాను.

బ్రాహ్మ :- నాయనా ! కలకాలము బ్రతుకు !

ద్వితీ - అనుగ్రహింపఁబడితిని. అర్యా ! నమస్కారము.

ప్రథ :- రారా ! వత్సా !

గీ. కౌఁగిలింపుము ! గాఢంబు గాఁగ నన్నుఁ
గౌఁగిలించెను శుభగుణగణము నిన్నుఁ
గౌఁగిలించును నీకీర్తి కడలఁ బ్రాఁకి
యీవసుంధర నెల్లను నింకమీఁద.

ద్వితీ :- అనుగ్రహింపఁబడితిని.

తృతీ :- ఆర్యా ! నమస్కరించు చున్నాను.

ద్వితీ :- శుభము.

తృతీ :- అనుగ్రహింపఁబడితిని.

- ఓ పురుషుఁడా ! కొంచెము మాట లాడెదను !

:- చెప్పుము–త్వరగాఁ జెప్పుము !

:- ఈయడవినడుమ సర స్సున్న ట్లున్నది. అందుఁ బరలోకమున
కేఁగునాకు దాహప్రతిక్రియ యొనర్చుకొని వచ్చెదను!

:- ఓ వజ్రసంకల్పుఁడా ! వెళ్లు ! త్వరగా రా! మాయమ్మ కాహార
కాల మతిక్రమించు చున్నది

:- ఓతండ్రీ ! ఇదిగో ! వెళ్లు చున్నాను.

[నిష్క్రమించును]

్రుఁడు :- అయ్యో! అయ్యో! దోఁచుకోఁబడితిమయ్యా! దోఁచుకోఁ
బడితిమి.

గీ. మూఁడు సిగరంబు లొప్పఁగా ముద్దు లొలుకు
వంశపర్వత మది నాది–భగ్న మైన
మధ్యశిఖరంబు గల దయి మామకీన
చిత్త ముత్తలపఱచు విశేషముగను.

అయ్యో ! కుమారా ! యేమీ ? పోనేపోయితివా ?

చం. నియమయుతంబు గా శ్రుతుల నిత్యము తత్పరబుద్ధితోడ న
ధ్యయన మొనర్చితోయి! యువ! యౌవనదీప్తికి నాటపట్టు నీ
వయితివి, పుష్పితం బయినయట్టిద్రుమంబు గజేన్ద్రదన్తసం
శ్రయమున భగ్న మౌనటులు నాశన మొందెద వెట్టులీవనిన్.

ఘటో :- తల్లి యాహారకాల మతిక్రమించు చున్నది. ఈ బ్రాహ్మణ బ్రహ్మచారి యాలసించు చున్నాఁడే! ఏమి చేయవలయును? కానీ! (ఉపాయము) తోఁచినది. బ్రాహ్మణుఁడా! నీకుమారునిఁ బిలువుము!

వృద్ధుఁడు :- అబ్బా! నీ వనినమాట రాక్షసులైనను ననరు.

ఘటో :- ఏమీ! కోపపడు చున్నావా? శాంతింపు. శాంతింపు! ఇది నాకుఁ బ్రకృతిసిద్ధ మగుదోషము. సరే! నీ పుత్త్రుని పే రేమి?

వృద్ధుఁడు :- అబ్బా! ఈమాటయు వినఁ గాదు.

ఘటో :- ఆఁ! ఇది తగును! బ్రాహ్మణకుమారుఁడా! నీ సోదరుని పే రేమి?

ప్రథ :- దయనీయుఁ డగు నాతఁడు మధ్యముఁడు.

ఘటో :- మధ్యముఁ డనుట యీతనికిఁ దగి యున్నది. నేనే యీతనిఁ బిలిచెదను. ఓమధ్యమా! ఓయీ! మధ్యమా! రా! శీఘ్రముగా.

[అనంతరము భీమసేనుఁడు ప్రవేశించును]

భీమసేనుఁడు :— ఓహో ! ఎవరికంఠస్వర మిది !

చం. ఘనతరుదుర్గమంబు బహుగాఢ మనేకవిహంగసంభవ
ధ్వనిబహులంబు నౌవిపినభాగమునందు మహోజ్జ్వలంబు గా
వినఁబడు చున్న దీస్వరము పెచ్చగు సవ్వడితో మనోజ్ఞరం
బును ఘటియించు చున్నయది పోలును జాలఁగఁ బార్థుకంఠమున్.

ఘటో :— బ్రాహ్మణబ్రహ్మచారి వెళ్లి చాలసే పైనది. అమ్మకు భోజన సమయము దాఁటి పోవు చున్నది ఏమి చేయుదును ! సరే! తోఁచినది. పెద్దగాఁ బిలిచెదను. ఓ మధ్యమా! ఓయీ మధ్యమా ! రా ! త్వరగా.

భీమ :— అబ్బా ! యెవఁడై యుండును! ఈవనమధ్యమున—నావ్యాయామమున కంతరాయము కల్గించుచు 'మధ్యమ, మధ్యమ' అని నను బిలుచు చున్నాఁడు. కానీ ! యెవరో ! చూచెదను. (ముందుకు నడిచి—చూచి) అహో ! ఈపురుషుఁడు చూడఁదగి యున్నాఁడు.

సీ. గమనంబు హనువులు గరిరాజునకు సీడు,
వదనదంష్ట్రిలు మృగపతికి నుద్ది,
శ్యేనంబు ప్రతి నాస, స్నిగ్ధగంభీరంబు
కంఠంబు, మధువును గలఁచుఁ గనులు,

మధ్యంబు వజ్రంబుమాదిరి, కనుబొమల్
పింగలవర్ణముల్, వెడఁద యెడఁద,
నిడుపు లై చెదరెడు నెఱులు, వ్రేలాడెడు
నున్నతాంసపుభుజయుగళి, వెలసి

గీ. విపులబలసంయుతుం డయి వీఁడు, నిజము
సంశయము లేదు రాక్షసనతికి నొక్క
భువనవీరున కెవనికో పుత్త్రుఁ డగుచుఁ
బుట్టియున్నాఁడు బలరూపములనుబట్టి.

ఘటో :- (తనలో) బ్రాహ్మణబ్రహ్మచారి వెళ్లి చాలకాల మైనది. అమ్మ కాహారకాలము దాఁటిపోవు చున్నది. ఏమి చేయుదును? కానీ! పెద్దగాఁ బిలిచెదను. (ప్రకాశముగా) ఓయీ! ఓయీ! మధ్యమ! త్వరగా రా!

భీమ :- ఇదిగో! వచ్చితిని.

ఘటో :- (తనలో) ఈతఁడు బ్రాహ్మణబ్రహ్మచారి కాఁడు. ఔరా! యీతఁడు చూడఁ దగియున్నాఁడు.

చం. పులిఁగులతేనిచట్టుపలఁ బోలి విలిప్తము లైనపక్షముల్
గలిగి, యలంతినెన్నడుము గ్రాలి, మృగేంద్రసమానవిగ్రహం
బలరి సువర్ణతాలభుజుఁ డై వికచాంబుజపత్త్రనేత్రుఁ డౌ
నలహరి యౌనా! యాఁచికొను నాగతబంధువటుల్ గనుంగవన్.

(ప్రకాశముగా) ఓమధ్యమ! నిన్నేఁగదా! నేను బిలుచుచున్నాను.

భీమ :- అందులకే కదా ! నేను వచ్చితిని.

ఘటో:- ఏమీ! నీవును మధ్యముఁడవా ?

భీమ :- నాకంటె మధ్యముఁడు నిజముగా మఱెవ్వఁడును లేఁడు.

గీ. మధ్యముఁడ నేను బుడమి నవధ్యులందు
మధ్యముఁడ నేను దృప్తులమధ్యమందు
మధ్యముఁడ నేను భూమిని, మధ్యముఁడను
భ్రాతృజనమందు నెల్లను భద్ర ! నేను.

ఘటో:- కావచ్చును !

భీమ :- ఇదే కాదు.

గీ. అఖిలకార్యంబులందు మధ్యముఁడ నౌదు,
మధ్యముఁడ నౌదు జనియందు, మధ్యముఁడను
నౌదుఁ బార్థివులందు, మధ్యముఁడ నౌదుఁ
బంచభూతంబులందును బరఁగ నేను.

వృద్ధుఁడు :-

కం. మధ్యముఁడా యనఁ బాండవ
మధ్యముఁ డిట కేఁగుదెంచె మమ్ముల నేత
ద్వధ్యుల వదలింప వనీ
మధ్యంబున మృత్యుదర్పమర్త్యుం డనఁగా.

మధ్యముఁడు :-

కం. పరలోకదుర్లభం బవు
నరవిందదలోజ్జ్వలంబు లంబువు లివి యీ
సరసిని వారిచి వీనిని
నరయఁగ నా కేన యిడితి నాత్మార్పణ గాన్.

(సమీపించి) ఓపురుషుఁడా! వచ్చితిని.

ఘటో :- ఇప్పుడే కదా! వచ్చితివి! మధ్యమా! మధ్యమా! ఇటు! ఇటు!

వృద్ధుఁడు :- (భీమసేనుని సమీపించి) ఓ మధ్యమా! బ్రాహ్మణవంశ ము ను గాపాడు!

భీమ :- భయపడకుఁడు! భయపడకుఁడు! మధ్యముఁడను నేను నమస్కరించు చున్నాను.

వృద్ధుఁడు :- వాయువట్లు దీర్ఘాయు వగుము!

భీమ :- అనుగ్రహింపఁబడితిని. ఆర్యులు భయపడుటకు నిమిత్త మేమి?

వృద్ధుఁడు :- వినుము! నేను గురురాజు యుధిష్ఠిరుఁడు పూర్వము పరిపాలించినకురుజాంగలదేశమందలియూపగ్రామమున నివసించు బ్రాహ్మణుఁడను. నాపేరు కేశవదాసు. మాఠరసగోత్రుఁడను, యజుశ్శాఖాకర్మానుష్ఠాతను. ఉత్తరదిశయం దుద్యామక గ్రామమున నాకు మేనమామ గలఁడు. అతఁడు కౌశిక

సగోత్రుఁడు. యజ్ఞబంధు వని యతనికిఁ బేరు అతని కుమారున కుపనయనము. అందులకై సకుటుంబము గా నేను బయనించు చున్నాను.

భీమ :- మార్గము నిరుపద్రవ మగుఁగాక ! తరువాత, తరువాత !

వృద్ధుఁడు :- అనంతరము, వీఁడుగో !

చం. జలములతోడియంబుదముచందము చెందినమేను పద్మపుం
దలములఁ బోలుకన్నుఁగవ దారుణదంష్ట్రిలు సింహయానలీ
లలు గల రాక్షసుం డితఁ డిలన్ మిముఁబోఁటుల మ్రోల నేఁడు భీ
తిల కరుదెంచుఁ బుత్త్రిల సతిన్ ననుఁ జంపఁగ గోరి వెంబడిన్.

భీమ :- ఇ ట్లైనదా ! ఈతఁడు బ్రాహ్మణజనమునకు మార్గవిఘ్నము కలుగఁజేసెనా ! కానీ ! వీనిని దండించెదను. ఓయీపురుషుఁడా! నిలు ! నిలు !

ఘటో:- ఇదిగో ! నిలిచియే యున్నాను.

భీమ :- ఎందుల కీబ్రాహ్మణునియెడ నీ వపరాధ మొనర్చు చున్నావు ?

గీ. సుతులు నక్షత్రములువోలెఁ జుట్టు నుండఁ
బత్ని చంద్రికయట్టులు బాసిలంగఁ
జంద్రుఁడునుబోలె వెలుఁగుద్విజాతివృద్ధు
మ్రింగ వచ్చితి రాహువుభంగి నీవు.

ఘటో.— అవును రాహువనే!

భీమ :— ఆఁ!

గీ ఎట్టియపరాధములయందు నేని ద్విజుఁడు
కాఁడు వధ్యుఁడు విడువుమీ! కాంతతోడఁ
దనయు లందఱతో ద్విజోత్తముని నితని
లోకయాత్రానివృత్తుని నాఁక యిడక.

ఘటో:— విడువను.

భీమ :— (తనలో) ఔరా! యీతఁ డెవరి పుత్త్రుఁడు?

కం. నాతోఁబుట్టుల నెల్లర
వీతఁడు గుణములను బోలె నెవ్వండొకోఁ!
యేతద్బాల్యోద్ధత్యము
మాతలఁపున కెక్కఁజేయు మాయభిమన్యున్.

(ప్రకాశము గా) ఓ పురుషుఁడా! విడువుము!

ఘటో:— విడువను.

కం. చెప్పెనయేనియు జనకుఁడు
తప్పదు నీ కనుచు విడువఁ దలఁపను వీనిన్
దప్పనిమాత్రాజ్ఞకు నై
యిప్పగిదిని నేఁ బరిగ్రహింపఁగవలసెన్.

భీమ :- (తనలో) మాత్రాజ్ఞ యనియా ! అహా ! ఈధార్మికుఁ డెంతటి గురుశుశ్రూషాపరాయణుఁడు !

గీ దైవతంబుల కెల్లను దైవతంబు
మానవుం డగువానికి మహిని జనని
తల్లియానతి నౌదలఁ దాల్చికాదె
తనయులము పొందినార మీదశను మేము.

(ప్రకాశము గా) ఓ పురుషుఁడా! నిన్ను నే నడుగవలసిన విషయ మున్నది.

ఘటో:- అడు గడుగు ! త్వరగా.

భీమ :- నీతల్లిపే రేమి ?

ఘటో:- విను ! ఆమె హిడింబ యనుపేరు గలరాక్షసి.

గీ. ఏమహాభాగ పూర్ణిమాసోముచేత
నాకసంబట్టులు సనాధ యయ్యెఁ బాండు
నాత్మజన్మునిచేత మహాత్ముచేత
సకలకౌరవ్యవంశదీపకునిచేత.

భీమ :- (తనలో) ఇట్టిదా యిది! హిడింబాపుత్త్రుఁడా యీతఁడు ! గర్వ మీతనికిఁ దగినదే !

కం. రూపము సత్త్వము బలమును
మాపగిదిని( జాల( గలదు, మానస మనుకం
పాపేతం బయి నెగడుచు
నీపగిదిని( బ్రజలయందు నె ట్లుండెడునో!

(ప్రకాశము గా) ఓ పురుషు(డా! విడువుము.

ఘటో:- విడువను.

భీమ :- బ్రాహ్మణు(డా! నీపుత్త్రుని నీవు గొనిపో! మే మీతని వెంట వెళ్లెదము.

ద్వితి :- వలదు-వలదు! నీ విట్లు చేయవలదు!

కం ప్రాణంబుల వదలితి గురు
ప్రాణంబులకై యపేక్షపడి ముందఱనే
యేను, వయోరూపగుణా
నూను(డ వీ వేల? వసుధ నుండుము తండ్రీ!

భీమ :- ఆర్యా! కా దనకు! నీ విట్లు కా దనకు! నేను క్షత్త్రియవంశ మున జన్మించితిని. బ్రాహ్మణు( డత్యంతము పూజనీయు(డు. అందులకే యీశరీర మొస(గి బ్రాహ్మణశరీరమును గొన( దల(చితిని.

ఘటో:- (తనలో) ఇట్టిదా యిది! క్షత్త్రియుఁడా యీతఁడు ! అందులకే యింతటిగర్వము ! కానీ! ఈతనినే వధించి తీసికొని పోయెదను!(ప్రకాశము గా) ఎవ రీతనిని వారించినవారు ?

భీమ :- నేను !

ఘటో:- నీవా ?

భీమ :- అవును !

ఘటో:- ఐన, నీవే రా !

భీమ :- వచ్చెదనుగాని, వీర్యబలాధికుఁ డగు పురుషునివెంట నేనుగా రాను. నీకు శక్తి యున్న బలాత్కరించి కొనిపో !

ఘటో:- నే నెవరో ! నీకుఁ దెలియునా?

భీమ :- నాపుత్త్రుఁడ వని నాకుఁ దెలియును.

ఘటో :- ఎ ట్లెట్లూ ? నీకుఁ బుత్త్రుఁడనా నేను !

భీమ :- ఏమీ: కోపపడుచున్నావా? శాంతింపు! శాంతింపు!క్షత్త్రియునకుఁ బ్రజ లందఱు పుత్త్రశబ్దవాచ్యులు. అందులకే నే ని ట్లంటిని.

ఘటో :- భీతు లగువారి కాయుధము శరణాగతి, అది చేపట్టితివి!

భీమ :-

గీ. అవుర ! యెఱుఁగను భీతి సత్యంబుతోడు
తెలియఁగోరెద నీకడఁ దెలియఁ జెప్పు
దానికలరూపు ! వయి నుచితం బెఱింగి
నడచెదను దద్గుణాగుణజ్ఞుఁడవు భద్ర !

ఘటో :- ఇదిగో ! నీకు భయ ముపదేశించుచున్నాను. ఆయుధము పరిగ్రహింపు !

భీమ :- ఆయుధమా ! పరిగ్రహించితిని.

ఘటో:- ఏదీ !

భీమ :-

కం. కనకస్తంభముతోడను
నెన యయి శాత్రవుల నిగ్రహించెడిఁ బ్రీతిం
గొని యీదక్షిణభుజ మొ
య్యన, నాకుం దగినయట్టియాయుధ మిదియే !

ఘటో :- ఇది మాతండ్రి భీమసేనునకుఁ దగినది.

భీమ :- ఎవఁ డాభీముఁడు ?

కం. శివుఁడో ! విష్ణువో ! బ్రహ్మయొ !
దివిషన్నాయకుఁడొ ! ధర్మదేవుఁడొ! గుహుఁడో !
యవు వీరలలో నెవనికిఁ
దవు నని యుపమింప నీదుతండ్రిని భద్రా !

ఘటో :- ఎవ్వనికా ! అందఱకును.

భీమ :- ఇసీ ! అసత్య మిది.

ఘటో:- ఎ ట్లెట్లా ! అసత్య మనియా! ఏమీ! మాగురువుల నధిక్షేపించు చున్నావా ? కానీ ! ఈమహావృక్షమును పెకలించి, దీనితోఁ బ్రహరించెదను (పెళ్లగించి కొట్టుచున్నాఁడు) ఏమీ! దీనిచేఁ గూడఁ జావ కున్నాఁడే! ఏమి చేయుదును ? కానీ ! తెలిసినది. ఈపర్వతశిఖరమును లాగి కొట్టెదను.

కం. విసరితి నీగిరిశిఖరం
బసువులఁ గొని యేఁగు నిదిగొ

భీమ :- యాగ్రహ మైనన్.

బసిదిండిని వన్యగజం
బెసఁగఁగ ధర్షణము చేయ దెందును వనిలో.

ఘటో:- (ప్రహరించి) దీనిచేతను జావ కున్నాఁడే ; ఏమి చేయుదును; కానీ ; తోఁచినది.

కం. తనయుఁడఁగద! భీమున కే
ననిలునకుం బౌత్త్రుఁడనుగదా; నా కెవరే
నెన గారు నియుద్ధమునం
దును బలుజతనంబుతోడఁ దొలఁగక నిలుమీ ;

[ఇద్దఱు మల్లయుద్ధ మొనర్తురు]

ఘటో :- (భీమసేనుని బంధించి)

చం. చనఁగల వెట్లు నా దగుభుజాయుగలిం బరిపీడితుండ వై
పెనఁగుద్రఢిష్ఠపాశములఁ బీడిత మౌగజమట్లు మద్భుజా
వినుతబలంబు త్రోయఁ గలవే ;

భీమ :- (తనలో) ఎట్లూ ; వీనికిఁ బట్టువడితినా ; ఓదుర్యోధనా ; నీ శత్రుపక్ష మభివృద్ధి పడయు చున్నది. రక్షణయం దప్రమత్తుఁ డవు కమ్ము ! (ప్రకాశము గా) ఓపురుషుఁడా; జాగరూకుఁ డవు కమ్ము ;

ఘటో:- జాగరూకుఁడనే ;

— (మల్లయుద్ధబంధము తొలఁగఁ ద్రోచి)

—బలదర్పము వీర ! వీడుమీ !

కనఁబడె నీదు సార మిటు కల్గదు నాకు నియుద్ధఖేదమే !

:— (తనలో) ఎట్లూ ! దీనిచేతను జంప వలనుగా కున్నాఁడే! ఏమి చేయుదును ! కానీ ! స్ఫురించినది. తల్లియనుగ్రహమున లభించిన మాయాపాశ మున్నది. దీనిచే నీతని బంధించి కొని పోయెదను. నీ ళ్లెట్లు దొరకును ? ఓపర్వతమా ! నీరు. ఓహో ! పర్వతమునుండి నీరు ప్రవహించు చున్నది. (ఆచమించి మంత్రము జపించును) (ప్రకాశము గా) ఓపురుషుఁడా !

కం. మాయాపాశసుసంయుతుఁ
జేయన్ వివశుండ వౌచుఁ జిక్కెద విదిగో !
వ్యాయతరజ్జునియన్త్రిత
మా యింద్రధ్వజ మనంగ నై జాతరలన్.

[అని మాయాపాశమున బంధించును]

ప :— (తనలో) ఏమీ ! మాయాపాశమున బంధింపఁబడితినా ? ఇప్పు డేమి చేయుదును? గోచరించినది. ఈశ్వరానుగ్రహ లబ్ధ మగు

మాయాపాశమోక్షమంత్రము నా కున్నది దానిని జపింతును నీ ళ్లెట్లు లభించును ? కానీ ; ఇట్లు చేసెదను ; (ప్రకాశము గా) ఓ బ్రాహ్మణకుమారా ; నీ కమండలువునం దున్న నీ ళ్లీ ;

వృద్ధుఁడు:- ఇవిగో ; నీళ్లు (నీ ళ్లొసఁగును) (భీమసేనుఁడు — ఆచమించి మంత్రము జపించును. మాయాపాశము వీడి పడును)

ఘటో :- ఏమీ ; మాయాపాశము వీడి పడిపోయినదే ; ఏమి చేయ వలయును ; కానీ ; ఇట్లు చేసెదను. ఓపురుషుఁడా ; పూర్వము నీ వన్నమాట స్మృతికిఁ దెచ్చుకో ;

భీమ :- నే నన్నమాటయా ? జ్ఞప్తికి వచ్చినది. పద ముందు;
[ముందు–ఘటోత్కచుఁడు, వాని వెనుక–భీముఁడు నడతురు]

వృద్ధుఁడు:- కుమారులారా ? ఏమి చేయుదము ? ఈ భీమసేనుఁ డీతనితో వెళ్లుచున్నాఁడు ;

గీ. ఉజ్జ్వల ద్ఘోరరూపుని నుగ్రవీర్యు
నసుర నొడిచియు నతనితో నరుగు నితఁడు
తోఁయఁ జాలియు జడివానతోన వృషభ
మల్లనం దీరునడకల నరుగునటులు.

రండు ; మనమును వెళ్లుదము ; (అందఱును వెళ్లుదురు)

[హిడింబా మందిరము – భీమ ఘటోత్కచులు ముందు, బ్రాహ్మణ కుటుంబము వెనుక – ప్రవేశింతురు]

ఘటో :– ఇక్కడనే యుండు! నీవు వచ్చినట్లు మాయమ్మగారికి విన్నవించి వచ్చెదను.

భీమ :– మంచిది. వెళ్లి రా!

ఘటో:– (లోపలికి వెళ్లి హిడింబను సమీపించి) తల్లీ! ఘటోత్కచుఁడను నేను. నేను నమస్కరించు చున్నాను. ఆహారమునకు నీ వెంతకాలము నుండియో కోరుచున్నమానిసినిఁ గొని వచ్చినాను.

హిడింబ:– (ప్రవేశించి) నాయనా! కలకాలము బ్రతుకు! ఎట్టి మనుష్యునిఁ దీసికొనివచ్చితివి?

ఘటో:– అమ్మా! శబ్దముచేతనే కేవల మాతఁడు మానవుఁడు. పరాక్రమమునఁ గాఁడు.

హిడింబ:– బ్రాహ్మణుఁడా!

ఘటో:– బ్రాహ్మణుఁడు కాఁడు.

హిడిం :– కానిచో వృద్ధుఁడా!

ఘటో:– వృద్ధుఁడు కాఁడు.

హిడిం :– బాలుఁడా?

ఘటో:- బాలుఁడు కాఁడు ?

హిడిం :- అట్లైనఁ జూతము.

[ఇద్దఱును నడుచు చున్నారు]

హిడింబ:- (చూచి) ఈమనుష్యునినా ? తీసికొని వచ్చితివి ?

[బ్రాహ్మణకుటుంబ మిప్పటికిఁ జేరవచ్చును]

ఘటో:- అమ్మా ! ఈతఁ డెవరు?

హిడిం:- వెఱ్ఱివాఁడా ! దైవమురా! యితఁడు.

ఘటో:- ఆఁ ! ఎవరికి దైవము ?

హిడింబ:- ఎవరికా ! నీకు. నాకు.

ఘటో:- అది యెట్లు ?

హిడిం:- ఇట్లు (సమీపించి) ఆర్యపుత్రా ! జయము, జయము!

భీమ :- (చూచి) ఎవ రీమె ! ఏమీ! దేవి హిడింబయా !

గీ. రాజ్యమును గోలుపోయి దుర్గమము లైన
యడవులను జొచ్చి తిరుగాడునట్టి మాకుఁ
గరుణ మూ ర్తీభవించినకరణిఁ దోఁచి
తీర్చితివి మాదు వెత లెల్ల దేవి నీవు.

అవునుగాని, ఇది యంతయు నేమి!

హిడిం :— (చెవిలో — ఏదో చెప్పి) ఆర్యపుత్రా! యిది యిట్టిది.

భీమ :— (సంతోషముతో) జాతిచేత నీవు రాక్షసివిగాని, ప్రవర్తనచేఁ గావు.

హిడిం :— వెఱ్ఱివాఁడా! నమస్కరింపురా! మీ నాయనగారికి.

ఘటో :— తండ్రీ! ధార్తరాష్ట్రవన దావాగ్ని యైన ఘటోత్కచుఁడు నమస్కరించు చున్నాఁడు, తమ యెడఁ గుమారుఁ డొనర్చిన సాహసము క్షంతవ్యము.

భీమ :— రా! రా! కుమారా! మాయెడ నీవు చూపిన వైయాత్యము మా కభిలషితము. (ఆలింగనము చేసికొని) ధార్తరాష్ట్రులవిఁ గార్చిచ్చు కాఁగల తనయునినే నీపితరుల హృదయము లపేక్షించు చున్నవి. కుమారా! అధికబలుఁడవు, అధిక పరాక్రమవంతుఁడవు కమ్ము!

ఘటో:— అనుగ్రహింపఁబడితిని.

వృద్ధుఁడు:— ఇట్టిదా యిది! ఈ ఘటోత్కచుఁడు భీమసేనుని కుమారుఁడా!

భీమ :— తండ్రీ! పూజ్యుఁ డగు నీ కేశవదాసునకు నమస్కరింపు.

ఘటో :— భగవానుఁడా! నమస్కారము!

వృద్ధుఁడు:- వత్సా ! తండ్రినిఁ బోలిన గుణకీర్తి సంపదలు గలవాఁడ వగుము.

ఘటో:- మహాభాగ్యము.

వృద్ధుఁడు.- వృకోదరా ! మా కులము కాపాడి మీ కుల ముద్ధరించితివి, మే మిఁక వెళ్లి వచ్చెదము.

భీమ :-

కం. త్వదనుగ్రహమునసేకద!
యిది యెల్లను శుభము గాఁగ ని ల్లేర్పడె న
య్యాదె ! మాయాశ్రమ మేఁగుఁడి !
పొదలుఁడి! విశ్రాంతి గొనుఁడి ! పోవుఁడి ! పిదపన్.

వృద్ధుఁడు:- మా కీజీవితప్రదానముచేతనే యాతిథ్యము నిర్వర్తిత మైనది! మేము వెళ్లెదము.

భీమ :- వెళ్లుఁడు! సకుటుంబముగా మరల మాకు దర్శన మిండు !

వృద్ధుఁడు:- మంచిది. మా కిది యవశ్యకర్తవ్యము!

[భార్యతో, పుత్త్రులతో-కేశవదాసు నిష్క్రమించును]

భీమ :- హిడింబా! యిటు రా ! తండ్రీ ! ఘటోత్కచా ! యిటు రా! పూజ్యుఁ డగు కేశవదాసు నాశ్రమద్వారపర్యంత మైనను వెంబడించి గౌరవింతము !

# భ ర త వా క్య ము

గీ. నదుల కెట్టులు ప్రభవమో యుదధి, యెట్లు
ప్రభవమో యాహుతుల కగ్ని, ప్రభవ మెట్టు
లింద్రియంబుల కెల్లను హృదయ, మట్లు
ప్రభువు మా కుపేంద్రుఁడు భగవానుఁ డితఁడు.

[అందఱును నిష్క్రమింతురు]

ఇ ది

హరితగోత్ర వేంకటసుబ్బమాంబా వేంకటప్పార్యపుత్ర
చిదంబరకవీంద్రభాగినేయ సాహిత్యాలఙ్కార
పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి విరచిత
మ ధ్య మ వ్యా యో గ ము
సర్వము సంపూర్ణము



| | |
|---|---|
| అచ్చతెలుఁగుకోశము (ఆంధ్రభాషార్ణవమునకు వ్యాఖ్యాన రూపమున వెలసిన మహానిఘంటువు (మూఁడు భాగములు) | 150-00 |
| ఆంధ్రపదకోశము (ఆంధ్రభాషార్ణవమున కకారాదిక్రమముతో వెలసినపదకోశము) | 30-00 |
| మధురావిజయము (సంస్కృతవ్యాఖ్యతో, ఆంగ్లపీఠికతో, దేవనాగరలిపితో) | 30-00 |
| మధురావిజయము (వచనకావ్యము, శిథిల (కథా) పూరణముతో) | 5-00 |
| గంగాదేవి (సాహిత్యచరిత్రల సమ్మేలనముతోడి యొకనవల) | 20-00 |
| సుభద్రాధనంజయము (నాటకము-ఆళ్వారులకృతికిఁ దెలుఁగు) | 5-00 |
| తపతీసంవరణము (నాటకము-ఆళ్వారులకృతికిఁ దెలుఁగు) | 5-50 |
| దానవీరుఁడు (నాటకము) | 5-00 |
| వాఙ్మయవ్యాసములు మొదటిభాగము | 30-00 |
| రెండవభాగము | 30-00 |
| మధురకవులు (వేమనాదుల సాహితీజీవితచరిత్రలసంగ్రహము) | 3-00 |
| శ్రీశైలస్థలపురాణము (స్కాందములోని శ్రీశైలఖండమునకుఅనువాదము, సర్వస్వామ్యములు శ్రీశైలదేవస్థానమువారివి) | |
| [కావ్యకళానిధి, శతావధాని పిసుపాటి చిదంబరశాస్త్రిగారి] జీవితచరిత్ర-అవధానసాహిత్యము | 25-00 |
| ఉభయరామలింగేశ్వరస్థలపురాణము | 10-00 |
| శివలీలాతరంగిణి [అముద్రితము] | 15-00 |
| మహాభారతము (యథాతథ మగుసంస్కృత భారతకథతోడి వచనకావ్యము) ,, | 10-00 |